Regd. No.
H. NL. 18
సంపుటి: 56
సంచిక: 37

# జమీన్ రైతు

స్థాపకులు : నెల్లూరు వెంకట్రామానాయుడుగారు
సంపాదకులు : నెల్లూరు శ్రీరామమూర్తి

13-9-85
శుక్రవారం
12 పేజీలు
75 పైసలు.

కృష్ణాపట్నం రేవు
కలకలంతో
జిల్లాఅంతా
సంబర పడుతుంటే

# నాయకులే నిద్రపోతున్నారు!

కృష్ణాపట్నం రేవులో ఎరుమేం ఓగు మతి కార్యక్రమం నిరాటంకంగా, నిర్విఘ్నంగా జరిగిపోతూంది. ప్రొద్దు పొడిచిన దగ్గరనుంచి, గ్రుంకేవరకు కాకినాడ వడవలు కండ్లేటిలో నిర్విరామంగా తిరుగుతున్నాయి. కూలీల సంఖ్యకూడా బాగా పెరిగింది, వచ్చిపోయే లారీలకు లెక్కలేదు. కృష్ణాపట్నం కళకళలాడుతూంది; కలకలంగావుంది.

వట్టునేకాదు - అక్కడ సుదూరంగా,

సముద్రంలోనేవున్న ఓడ సిబ్బందికూడా ఎంతో సంతోషంతోవున్నారు. మొన్న ఆదివారం ఓడచూడడానికి వెళ్ళినపత్రికా విలేఖరుల బృందాన్ని వారెంతఆదరంగా ఆప్యాయంగా పలకరించారో చెప్పలేము. నెల్లూరీయులు బహుగొప్పవారని. వారి ఆతిధ్యం అమోఘమని పొగిడాడు ఓడ కెప్టెన్ శ్రీ ఆంటోనియో.

కృష్ణాపట్నం రేవుకూడా అదేరీతిలో ప్రశంసించారాయన. రేవుగా అభివృద్ధి చేయడానికి ఇది ఎంతో తగి వుందని అయనంటాడు '24 సంవత్సరాల తర్వాత ఇక్కడ లంగరేసిన ఓడ నాదికావడం నాకెంతో గర్వం కల్గిస్తూంది; ఒక చారిత్రక ఘటనలో నేను పాలుపంచుకుంటున్నాను; ఈ రేవు అభివృద్ధి చెందితే, నాపేరు, నా ఓడరాక ఎంతోకాలం మీకు గుర్తుండిపోతాయి; అదేనాకు అపరిమిత సంతసాన్ని కల్గిస్తూంది- అన్నాడు ఆంటోనియో.

ఈ "రియలూనా" ఓడ ఇప్పుడు ఒడ్డుకు మూడుకిలోమీటర్ల దూరంలో వుంది. మొదట లంగర్ వేసింది నాలుగున్నర కిలోమీటర్ల దూరాన; క్రమక్రమంగా జరుపుకుంటూ ముందుకువచ్చేరాతు.

ఈ ఓడేకాదు, అక్కడినుంచి సరకులు దిగడం, పడవల కెక్కించడం వంటి కార్యక్రమాలు కూడా నయనానందకరంగా వున్నాయి. దాదాపు ఒకటిన్నర ఫర్లాంగు దూరం వుంటుంది ఓడపొడుగు. అంతా మంచి కండిషనులో ఎరుపులో వుంది; పైభాగం తెలుపు. సిబ్బందిగదులు, ఆఫీసురూములు అన్నీ సెంట్రల్ ఎయిర్ కండిషన్ చేసివున్నాయి. లోపలికరుగు పెడితే; ఫైవ్‌స్టార్ హోటల్‌వలె వుంది. ఓడలో ఈ భాగం పాతిక మాత్రమే. ఇందులోనే పడవనదిపేయంత్రాలుకూడా వున్నాయి. అంత భారీనౌకకు. మామూలు కార్లకుండేసైజు స్టీరింగే వుంది.

మిగిలిన ముప్పాతికభాగం ఎరువులే; కొత్తైన కందకాలవలె మూడు విశాలమైన గదులున్నాయి. ఒక్కొక్కటి ఒక చిన్న ఊరంత సైజులో వున్నాయవి. వాటిలో యూరియా మ సిదిగా పోసివున్నారు. కూలీలు దాన్ని బస్తాల కెక్కించితే, ఓడపైనేవున్న పెద్ద క్రేన్ ఒక్కసారి పాతికబస్తాలను ఎత్తి ఓడ క్రింద నిలబడిన చిన్న పడవలపైకి వినిరేస్తూంది. ఈ 5న తా 5 నిమిషాల్లోనే; 150 మందికూలీలు దీనికోసం ఓడపై మకాం పెట్టివున్నారు.

శ్రీ నాయుడు దశరథరామరెడ్డి,



కృష్ణాపట్నం చేరిన తొలి
నార్వేనౌక "రియలునా"

ఆయన కుమారుడు కేశవరెడ్డి ఎంతో పరిశ్రమించి, ఎందరిచుట్టో ప్రదక్షిణలు చేసి, పట్టుబట్టి ఓడను ఈ రేవులో దించారు; వారిశ్రమ వృధాకాలేదు; వారి సంకల్పం విఫలంకాలేదు.

కృష్ణాపట్నం రేవు ఉజ్జ్వలభవిష్యత్తు కోసం ఇక్కడి వ్యాపారులు, వ్యాపార సంస్థలు ఎంతో శ్రమాదులకోర్చి, సాహసంచేసి, అహోరాత్రులు పనిచేస్తుంటే శాసనసభ్యులుకాని, రాజకీయ నాయకులుకానీ ఏమీపట్టనట్లు వ్యవహరించడం దారుణంగావుంది; సిగ్గుచేటనిస్తూంది. ఓడ లంగరేసి మూడువారాలు పూర్తయ్యాయి, అయినా జిల్లామంత్రికి అక్కడికి పోయిరావడానికి తీరికదొరకలేదుపాపం. మొన్న 30 వేలతో కట్టిన స్కూలు భవనాలకు రిబ్బను కత్తిరించడానికి హైదరాబాదునుంచి వనిగట్టుకొని ఈమధ్యలో రెండుసార్లు జిల్లాకు వచ్చిపోయారాయన. అయన్నమకొని ఏమిలాభం? ముత్తుకూరే స్వగ్రామంగాకల్గిన స్థానికశాసన సభ్యుడుకూడా ఇంతవరకు అయిపులేదు.

కృష్ణాపట్నం రేవులో తొలి ఓడ లంగరు ప్రయత్నం సఫలీకృతమైనప్పటికి, రేవు అభివృద్ధి కృషికి ఇది అంతం కాదు; ఆరంభంకింద లెక్క. ఈ విజయాన్ని ప్రాతిపదికగా తీసుకొని జిల్లా నాయకులు రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలను కదిలిస్తేతప్ప, నిర్విప్రయత్నంచేస్తేతప్ప రేవుకు భవిష్యత్తులేదు. అవలిది ఒక రేవుగా రూపొందడానికే చేయవలసింది చాలావుంది.

కండ్లేరు ముఖద్వారంలో ఏర్పడిన ఇసుకమేటను తొలగించనిదే. ఓడలు ఒడ్డుకు రాలేవు; అవి వడ్డుకునస్తే సరకులు దించడం, ఎక్కించడం సులభతరమై, చవకై రేవు మూడు ఓడలు. అరు పడవలుగా దినదినాభివృద్ధి చెందు

—కొనవ 8వ పేజీలో

జిల్లా మంత్రికి
తీరికలేదు!
స్వగ్రామస్థుడైన
శాసనసభ్యుడు
అయిపులేదు!

నడిసంద్రంలో
ఓడను
సందర్శించిన
మావిలేఖరి
కథనం



ఓడనుండి ఒడ్డుకుచేర్చే పడవలోకి
యూరియా బస్తాలు దించుతున్న క్రేన్

# సోనియాగాంధీ అధ్యక్షురాలా?
# రాజీవ్ ఈపొరపాటు చేస్తాడా?

ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ సతీమణి శ్రీమతి సోనియాగాంధీకి కాంగ్రెస్ అధ్యక్షతా? రాజీవ్‌గాంధీ అంతపొరపాటు చేస్తారా? ఈ సమస్య కేవలం వూహాగానలహరిలో లేదు; ఆమెను ఆ సహోన్నతపదవిలో కూర్చోబెట్టడానికి ప్రయత్నాలు ప్రారంభమయ్యాయికాబట్టి దీన్ని గూర్చి ప్రస్తావించవలసివస్తున్నది.

ఉత్తరప్రదేశ్ కాంగ్రెస్ వాదులు కొందరు ఆమెను అధ్యక్షురాలిని చేయవలసిందిగా ప్రధాని, కాంగ్రెస్ అధ్యక్షుడు అయిన రాజీవ్‌గాంధీకి ఒక విజ్ఞాపన పత్రాన్నే సమర్పించుకున్నారట. వీహాకు యూత్ కాంగ్రెసీయులు కదితులు ఇంకా ధిల్లీవరకు పోయినట్లులేదు కాని, వారూ సోనియాకు కాంగ్రెస్ అధ్యక్షత అనే ఉద్యమాన్ని ప్రారంభించారు. కాంగ్రెస్ రాజకీయాలలో ఇదొక అంటు జాడ్యం; ప్రధాని అభిమానాన్ని పొందడానికి, అయన దృష్టిలో పడడానికి ఇక అన్నిరాష్ట్రాలవారూ బయటపడబోతారు.

సోనియాగాంధీని కాంగ్రెస్ అధ్యక్షురాలిని చెయ్యాలనే ఆలోచన కలగడానికి కారణమేమిటో తెలియదు. అనసవిని ఆమెకున్న అర్హతలేమిటో అర్థంకాదు


భారతజాతీయ కాంగ్రెస్ స్థాపకుడు తెల్లదొర హ్యూం కాంగ్రెస్, నూరేళ్ళవిండి

నూట ఒకటవసంవత్సరంలో అడుగుపెట్టబోతున్న ఈకకకంలో మరొక యూరప్ దేశస్తురాలు వుండడం బాగుంటుందనే విచిత్రమైన ఆలోచన ఎవరికైనా కలిగి వుంటుందా? సోనియాగాంధీని ఇప్పుడు ఇటలీదేశస్తురాలనలేము; విదేశీయురాలనలేము ఆమె భారతపౌరసత్వంపొంది, భారతీయ వేషభాషలను స్వీకరించి, భారతప్రధాని అర్ధాంగిగావుంటున్న వనీమణి. అందువల్ల విదేశీయురాలనే కారణంగా ఆమె అభ్యర్థిత్వాన్ని ఆక్షేపించలేము. కానిఆమెనుప్రతిపాదిస్తున్నవారిలో సోనియాను కాంగ్రెస్ అధ్యక్షురాలిని చేయాలనే చిత్తశుద్ధి వుండదు; ఆమె పేరు ప్రతిపాదించడంద్వారా రాజీవ్ మెప్పుపొంది రాజకీయంగా లాభపడాలనేది వారి నిజోద్దేశ్యంగా వుంటుంది.

ఈ వేదాంతంతో పోల్చదగం కాదు కాని, కాంగ్రెస్‌లోని ఈ విదూషకులు క్రితంలో సంజయ్‌గాంధీని ఇట్లాగనే పెదమార్గం పట్టించింది? ఆయన్నూ కాంగ్రెస్ అధ్యక్షుణ్ణి చేయాలన్నారు;

—కొనవ 8వ పేజీలో

## వి. ఆర్. హైస్కూలు - టీచర్లు, విద్యార్థులు, పాఠాలు

# "ఒరే ఎగనష్ట అనరా!"

-ఇంగ్లీషు టీచరు సింగరాచారి

# "ఎగనట్సు... ఎవరెస్టు"!

· విద్యార్థి పరబ్రహ్మం

చదువుసంధ్యలకు అంతిమ గమ్యస్థానం నెల్లూర్లో వెంకటగిరి రాజా కళాశాల. అన్ని స్కూళ్ళు, ఏళ్ళ ప్రవాహాలంతా సముద్రంలో కలిసినట్లు వి. ఆర్. కాలేజిలో కలిసిపొయ్యేవి. వి. ఆర్. కాలేజికి రావడానికిముందు టవున్‌లో వి ఆర్ హైస్కూల్ వుండేది. దాంట్లో పాఠాలుచెప్పే ఉపాధ్యాయులను గురించి రామయ్యంగారెక్కడున్నార్రో అని అనే టప్పటికి అవతలండాలో అక్కడా ఇక్కడా తారట్లాడే పెద్దవాళ్ళంతా ఎక్కడి వాళ్ళక్కడే సెళ్ళదాగుకునేవారు. అట్లాంటి వాళ్ళెక్కడున్నారిప్పుడు? 'అనేవాళ్ళు మా సీనియర్లు. మా కంటా మా ఎదుటగానే సంతాన రామయ్యంగారు వచ్చి బెదిరిస్తున్నట్లుండేది. సంతుళ్ళు పిల్లలకి భయం లేకుండా చేసేవి. "ఎగెనష్ట" - పరబ్రహ్మం "ఎవరెష్టు"-"తో ముందాకొతరా విన్న బ్రహ్మదేవుడికి పెళ్ళాం గూడ మాట్ళలేదనేవాడట. అతింగ్రాచారి బి.ఎ పరీక్షకు 8 సార్లు కట్టాడట; పాస్ కానే లేదు పరబ్రహ్మం వ్యాపారంచేసి లక్షలు గడించాడు-ఎగనష్ట, ఎగనట్సు, ఎవరెష్ట అంటూనే.

వాళ్ళతర్వాత బైరంతపు మద్నారావు అసిస్టెంట్ హెడ్‌మాస్టర్‌ను చూస్తే భయం,, అయనకోటు, తెల్లధోవతి; లాయర్లు వేసుకొనే స్టిఫ్ కాలరు కిప్టేంటు కాళ్ళకు చెప్పులుండేవికావు. కొంతమంది టీచర్లు క్లాసులో వరకయారనపడేవాళ్ళు; పాటలు; కాగితంలో విమానాలు, బాల్స్ ఎగిరేవి. కోటు వెనుకపక్కంతా సిరా కొట్టేవాళ్ళు.

అందుకో మాకు కే కే. అని కొత్త మాస్టర్ వచ్చారు. అంతే - క్లాసులోకి

### నా నెల్లూరు జ్ఞాపకాలు

❖❖ ప్రొఫెసర్ కె. శేషాద్రి ❖❖

కథల్లి చెప్పేవాళ్ళు కథలు చెప్పే వాళ్ళకు కాలవ్యవధి వుండేది. దీనిని వినేవాళ్ళుగూడ ఏ మాత్రం విసుగులేకుండా వినేవాళ్లు. మేమంతా అప్పుడు చిన్నకుంకలంగదా! అప్పుడు మాకు వయసుల అంతరం (Generation gap) అనే పదం తెలియదు. పైవాళ్ళు ఏదో చెపుతుంటే వినడమే.

"ఏం చదువులురా మీవి. మేము స్కూలులో వుండగా సంతాన రామయ్యంగారు హెడ్‌మాస్టర్; అయన్నుచూస్తే హడల్. పొట్టిగావున్నా ఎంత పెద్ద గాడిదవంటి రౌడిగాడయినా ఎగిరెగిరి కొట్టేసేవాడు అంతటితో మిగతాక్లాసంతా గప్‌చిప్. అదిగో సంతాన పెట్టేవాడికే వళ్ళుల్లుండి. "అయితే తరే చెప్పేవాడు" అనేవాళ్ళు మా సీనియర్స్.

అయనకు సింగ్రాచారికిరోటి. "సింగ్రాచారి ఇంగ్లీషు గ్రామర్ చెప్పాలే, మనం వినాలె" అని వాదనేవాళ్లు మా సీనియర్స్. కానివాళ్ళు గ్లీషుమీనమాత్రం అ సింగ్రాచారి గ్రామర్‌యొక్క ప్రభావం అంతగా కనబడేదికాదు, అ మాట చెప్పేదానికి భయంగదా! "ఒరే ఎగనష్ట అనరా" అనేవాడట సింగ్రాచారి. వాడు "ఎగనట్సు" అనేవాడట, అపరబ్రహ్మం "ఎగనష్ట" పలుకుఅంటాడు ఇంగ్లీషులో మేధావి సింగ్రాచారి, పరబ్రహ్మం తనపేరుకు సార్థకంగా "ఎగనట్సు" అని నొక్కి అనేవాడు. కోపంతో సింగ్రాచారి ఒక

---

### సంతాన రామయ్య

"పొట్టిగా వున్నా గాడిదంతటి వాణ్ణి ఎగిరెగిరి కొట్టేసేవాడు"

❖

### బంగారయ్య

"బండి ఎక్కుతుంటే కాడి నలుగురు పట్టుకోవాలి!"

❖

### దీపాల

"పద్యాన్ని రాగయుక్తంగా ఎత్తుకుంటే క్లాసు గప్‌చిప్"

❖

### విశ్వనాథం

"సైన్స్ మాస్టారుగారి ముక్కుపొడి రహస్యం"

---

వచ్చినప్పటినుంచి అయన్ను మాకు చెంబులనీళ్ళు తాగించేవాడు. కోటంతా సిరా. అతనికి కళ్ళలో నీళ్ళు వచ్చేవి. అకాలంలో వుద్యోగం దొరకడం మహా కష్టం. కాబట్టి అయన ఇన్నికష్టాలను ఓర్చి ఉద్యోగం చేసేవాడనుకుంటా. ఇంట్లో పెద్దసంసారం, అందర్నీ పోషించాలె: క్లాసుకువస్తే ఈ బ్రహ్మరాక్షసుల అల్లరి: తెలుగు టీచర్ వచ్చాడంటే ఇక యమగోలం అందులో బంగారయ్య పెద్ద దేహం: నల్లటి రాయి, నామాలు, కాళ్ళకు అరవి కడుపులు (కదుమేమం వుండవచ్చు పాపం) ఒక ఎద్దుబండిలో తంగనాయకుల పేటనుంచివచ్చేవాడు బండెక్కేటప్పుడు నలుగురు బండికాడిని పట్టి ఒత్తిపట్టాలి,

-తరువాయి 10 వ పేజీలో





## పినాకిని తీరం

### కాగితాలమీద

### పండిస్తుంది వ్యవసాయశాఖ!

10 తేది పొద్దున్నే ఆకాశవాణి చెప్పిన ఒకవార్త విని నవ్వుకోవలసి వచ్చింది. అసలు రేడియోలో ప్రాంతీయ వార్తలంటే ప్రభుత్వ బులెటిన్లుతప్ప మరేమీ వుండడంలేదు.

అది ఏమిటి: నెల్లూరు జిల్లాలోనట 1985-86 ఖరీఫ్, రబీలలో కలసి 4,70,000 టన్నుల బియ్యం; 2 41,000 టన్నుల చెరకు; 20,000 టన్నుల జొన్న; 22 500టన్నుల సజ్జ; 30,000 టన్నుల వేరుసెనగ పండించాలని లక్ష్యంగా పెట్టుకున్నారట. దీనికోసంగా వ్యవసాయశాఖ రాత్రింబవళ్ళు కష్టపడి చెమటలుపట్టేటట్లు పథకాలు తయారుచేస్తే దానిమీద సుదీర్ఘంగా చర్చించి భేష్‌భేష్ మంటూ హర్షామోదాలు తెలియజేయడ్డాయట.

పాత అంకెలతో పోలిస్తే ఈ ఫ్యాలు ఇంతేనా అనిపిస్తుంది, 1984-85 వ్యవసాయశాఖ సాధించిన "విజయాల" అంకెలలో వెంటనే దొరకలేదు. 1983-84 లో మాత్రం బియ్యం 4,30,000 టన్నులు; జొన్నలు 21,000టన్నులు; సజ్జ 19 100 టన్నులు పండించారట. అంటే జొన్న రెండేళ్ళ అనంతరం ఒక వెయ్యి తగ్గించి మట్టంగా ఇరవైవేల టన్నులు లక్ష్యంగా నిర్ణయించుకున్నారన్నమాట. వేరుసెనగది మరీ విచిత్రం. 1984.85 లో 37,000 టన్నులు పండితే ఈ సంవత్సర లక్ష్యం ముప్పయ్ వేలటన్నులు! చెరకు గత సంవత్సరం గానుగ ఆడింది 90 వేల టన్నులు; ఇప్పుడు మధ్య సీజనులో 30 వేల టన్నులు ఆడుతామంటున్నారు; రెండూ కలిస్తే లక్ష 20 వేల టన్నులు, అటువంటిది 1985-86 లక్ష్యం 2 లక్షల 41 వేల టన్నులట.

కలెక్టరుగారూ! హాస్యాస్పదమైన ఈ అంకెల గారడీని మీరు గమనించారా? అసలు ఈ లక్ష్యాల అంకెలకు ఆధారమేమిటి? ఈ లక్ష్యంను సాధించేదెవరు? ఈ లక్ష్యసాధనకు వ్యవసాయశాఖ సిబ్బంది ఆయినా దోహదమిస్తున్నదా? రైతు పాపం ఎంతవరకు కష్టపడి పండిస్తే వ్యవసాయశాఖవాళ్ళు అకీర్తిని తమ ఖాతాకింద జమవేసుకుంటారు. ఈ నాడు జరుగుతున్నదిదే. రైతుకు వ్యవసాయశాఖీయుడు కలికానికి కూడా కనపడడంలేదు. ప్రస్తుతం వ్యవసాయ శాఖ కాగితాలమీద, పత్రికాలమీద, సమావేశాలమీద అక్షరరూపంలోనో, మాటలరూపంలోనో లక్షలాదిటన్నులు పండించాల్సిందే: రైతు లేకుంటే వాని లక్ష్యాలు కూడా అపిధంగా నెరవేరవలసిందే. ఇది విజం; ముమ్మాటికీనిజం!!

### దాసరి తిప్పలు

### పెదమాళ్ళకెరుక!

పాపం వెంకటగిరి సమితి అధ్యక్షుడు అల్లం శశ్వతయ్యది రాజకీయంగా ఎంగిలి బతుకై పోయింది: కాంగ్రెస్ వాదిగా సమితి అధ్యక్షుడయ్యారు; మధ్యలో తెలుగుదేశం కి బోర్డుతిప్పారు; మొన్న కాంగ్రెస్ సమితి ఉపాధ్యక్షుడైన చెలికం శంకరరెడ్డి తెలుగుదేశం ఎం. ఎల్. ఎ. కు విరుద్ధంగా బలపరచారు; ఇప్పుడు ఎం. ఎల్. ఎ, తెలుగు దేశీయుడు కాదని, అసలుసిసలు విశాత్పయిన తెలుగుదేశం రక్తం తనదని ప్రకటన చేస్తున్నాడు. తనకు పదవు ప్రతిష్ఠ అక్కరలేదనుకోండి; ఆ ఎం. ఎ దగ్గరకుంటే స్థాయి గౌరవాన్నయినా కాపాడవలసిన అవసరంలేదా? యూతు యూతు అంటారు: వానిపరత మవితంగా బూతుబూతుగా వుంటున్నది.

ఈ శశ్వతయ్య పంతులుగారికి తన పూల్లో ఏదో భూముందిగ్రమింగుడు వ్యవహారం ఒకటున్నట్లుంది. పైగా సమితి అధ్యక్షుడుగావుండి ఒక వి.డి.ఓ. మీద పరిటి కొట్టడం అతను పోలీస్ ఫిర్యాదుచేయడం: అరెస్టు తప్పించుకో దానికి కోర్టుకొ తొంగిపోవడం, ఇటు

-తరువాయి 10వ పేజీలో

# కోటలో కలరా- ముగ్గురు పిల్లల చావు!

కోట గిరిజన కాలనీ గో కలరావ్యాధికి మూడు పసిప్రాణాలు బలైపోయాయి. ఎందువల్ల ఈ మహమ్మారి తన విష పాశం గ్రామంలో మోపిందో- ఎప్పుడు ప్రవేశించిందో తెలియదు కాని 9 తేది రాత్రికి ఇది బాగా వ్యాపించిందట. దాదాపు 25 మంది చిన్న పెద్ద వ్యాధికి గురైనారట. అ రాత్రే ఇద్దరు పిల్లలు ప్రాణాలు కోల్పోయారు.

అప్పటికి కాని అధికారులు కలగ జేసుకోలేకపోయారు. కలెక్టరు కు ఈ విషయం తెలిసి, ఆఘమేఘాలమీద మందులు, మాత్రలు ఇప్పించి, వైద్య శాఖాధికారులను కోటకు పంపారు. డి ఎం హెచ్ ఓ దక్షిణామిరెడ్డిగారు కూడా వెళ్ళారు.

అప్పుడు రోగులందరినీ ఆస్పత్రిలో చేర్పించారట. అందులో పరాశ ఎనిమిదేళ్ళ పాప 10 తేదీ ఉదయం మృతి చెందింది. మిగిలి వారు క్షేమంగా వున్నారు. గ్రామంలో ముందు జాగ్రత్తగా వ్యాధినిరోధక చర్యలు తీసుకున్నారు.

## బియ్యం కోటా పెరిగింది!

నిత్యావసర వస్తువుల పంపకం విషయంలో జాయింట్ కలెక్టర్ శ్రీ దయాచారి చూపుతున్న శ్రద్ధా సక్తులు చూస్తుంటే అచ్చెరువు కల్గుతుంది. అపు

## జిల్లా వార్తలు

రూపవిప్పిస్తూంది. జిల్లా మొత్తం మీద ఏ మండలానికి, ఏఏ వర్తకులకు ఎంతెంత కేటాయించిందీ, ఎంతకాలం పంపకం జరిగిందీ, తదితర లెక్కలు ఆయన నోట్లోనే నానుతున్నాయి. అంటే, ఈ కార్యక్రమంలో ఆయన సాన్నిహిత్యమెంతో చెప్పకనే అర్థమౌతుందికదా! ఏమూలనుండి ఏచిన్న ఫిర్యాదు వచ్చినా ఆ నే స్వయంగా పరిష్కరిస్తున్నారు. తప్పుచేసిందెవరైనా అధికారి అయినా, డీలరైనా ఆ రోజుతో ఆఖరు. శిక్ష అంతకఠినంగా చురుకుగా వుంటుంది.

పైగా పంపకంలో వివిధ లోసుగులు పరిష్కరించారు. ఇదివరకు సి.ఎస్.సి. వార గోదాన్సునుంచి హోల్‌సేలు వర్తకులద్వారా డీలర్లకు సరకులిచ్చేవారట. ఇది రద్దు చేసి, నేరుగా గోదాముల నుంచే 28 మండలాలలో సరఫరా చేస్తున్నారట; దీనివల్ల ప్రభుత్వానికి నెలకు లక్ష 27 వేల రూపాయలు ఆదా అవుతుందట.

ఈ పాలన చర్యలతోపాటు దయాచారిగారు అగస్టు నుంచి బియ్యపుకోటాను పెద్దమొత్తాలు అధికం చేశారు. పీడీ పంపకం ప్రస్తుతం 94 శాతం జరుగుతుందట రికార్డులో ఇది.

### తెలుగుగంగ పరిహారం- ఎన్టీఆర్‌తో నువ్వుల మొర!

తెలుగుగంగ ప్రాజెక్టు ముంపు భూములకిచ్చే నష్టపరిహారంలో రైతులకు అన్యాయం జరుగుతున్నదని మాజీ ఎమ్మెల్యే శ్రీ నువ్వుల వెంకటరత్నం నాయుడు ఎన్టీఆర్‌కు చెప్పారు. పొలాల విలువ నిర్ణయించకుండా మెట్ట, మాగాణి అని రెండే రకాలుగా నిర్ణయించారని, ఇది మార్కెట్టు ఆధారంగా విలువ నిర్ణయించాలని కోరారు. డిపాజిటు కట్టాలన్నవారికి కూడా పరిహారం చెల్లించాలని, భూములు కోల్పోయిన రైతు కుటుంబీకులకు ఉద్యోగావకాశాలివ్వాలని ఆయన కోరారు.

### వెంకటగిరి సమితి అధ్యక్షుడి సరెండర్

ఒక వివాదంతో జరిగిన సంఘర్షణలో ముద్దాయిగా కేసు మోపబడినందువల్ల వెంకటగిరి సమితి అధ్యక్షుడు అల్లం కృష్ణయ్య 9 తేదీ గూడూరు మేజిస్ట్రేట్ కోర్టులో హాజరై, బెయిల్ పొందారు. పంచాయతీ ఛేంబర్ అధ్యక్షుడు నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డి ఆయన్ను తెచ్చి బెయిల్ ఇప్పించి, తర్వాత ఊరేగింపుగా, వినోదాలు చేసుకుంటూ వెళ్లారు. ఏమి ఘన కార్యం జరిగిందనో మరి!

### కావలి టీచర్ అఘాయిత్యం

కావలి జి. వ. హైస్కూలు డ్రిల్ టీచరు. జోసఫ్, తప్పత్రాగి స్కూలుకు వచ్చి ఒక విద్యార్థిని తిరస్కారంగా అసభ్యతతో దాడిచేశాడట; అతడికి తలపై పెద్దగాయం తగిలిందట.

ఇదివరకు ఈ ప్రబుద్ధుడు నేరుగా హెడ్మాస్టరునే కత్తితో పొడుస్తానని బెదిరించాడట. త్రాగనిదే స్కూలుకు రాడట. అధికారులకు, పోలీసుకు ఫిర్యాదు చేసినా అతడిపై ఏచర్యా తీసుకోలేదని తెలిసింది. ఇటువంటివారిని వత్తిడులకు లొంగి క్షమించడం ఇంకా పెద్దనేరం. డి ఇ ఓ గారు వెంటనే చర్య తీసుకోవాలి.

### చెన్నూరు సాహిత్యసభ

గూడూరుతాలూకా చెన్నూరులో మిత్రమండలి 7 తేది ఒక సాహిత్యసభ జరిపింది. శ్రీ ఐ. నాగరాజు అధ్యక్షత వహించారు; కృష్ణావతార వైశిష్ట్యంపై శ్రీ కె.

—కావలి 8 వ పేజీలో





# స్పిన్నింగ్ మిల్లు సమ్మె

నెల్లూరు స్పిన్నింగు మిల్లు మేనేజింగ్ డైరక్టర్ శ్రీ రాజశేఖర్ పాండే ను బదిలీ చేసినందుకు నిరసనగా 12 తేది ఉదయం అన్ని కార్మిక సంఘాలు సమ్మెకు దిగాయి. రెండ్రోజుల మూతపడిన మిల్లును ఆయన అభివృద్ధి చేశారట; మిల్లు పిరదొక్కుకునేంతవరకు ఆయన్నిక్కడే కొనసాగించాలని వీరి కోరిక.

### ఇంత జులుమా?

రెండావీధికి చెందిన ఒక ముస్లింయువకుడ్ని 8 తేది రాత్రి పోలీసులు ఇంట్లో నుంచి బలవంతంగా తీసుకెళ్ళిపోయి కొట్లో తోశారట. అతడు చేసిన నేరం- స్థానిక తెలుగుదేశం నాయకుడొకరికి విరోధి కావడమేనట. అంతకుమించి ఫిర్యాదూ లేదు- కేసూ లేదు.

నెల్లూరులో పోలీసు జులుం మరీ శృతి మించుతుంది కదూ!

### విశ్వనాథరెడ్డి సంస్మరణ

ఔత్సాహిక నాటకరంగానికి తన జీవితాన్నే కాక తనకున్నదాన్ని కూడా కళామతల్లి సేవకే అంకితంచేసిన ధన్యజీవి జగ్గ విశ్వనాథరెడ్డికి నెల్లూరు కళాజీవులు 6 తేది ఘనంగా శ్రద్ధాంజలి ఘటించారు.

టౌనుహాలు రీడింగురూములో జరిగిన ఈ సభలో శ్రీ అగస్త్యరెడ్డి వెంకురెడ్డి, రూపశిల్పి వి. కుమార్, కృష్ణారెడ్డి. గాదెపల్లి రామయ్య, పులుగుండ్ల రామకృష్ణయ్య, పి. శంకరయ్య, ఇస్మాయిల్ ప్రకాశ్ తదితరులు విశ్వనాథరెడ్డి కళాసేవలను సంస్మరించారు.

కృష్ణారెడ్డి జెయిల్ అధికారిగా వుంటూ ఉద్యోగానికి రిటైరైనా నాటకరంగానికి జీవితాన్ని దారపోశాడు, ఆంధ్రదేశమంతా పాదలాడి నాటక ప్రదర్శనలు చేశారు. అగస్టు 28 తేది, 71 ఏళ్ళ కాలధర్మం చెందారు.

### నర్సుల దీక్షలు

పెద్దాస్పత్రిలో నర్సులసంఖ్య పెంచాలని కోరుతూ, 9 తేది నుంచి ఆస్పత్రి ఎదురుగా నర్సులు రిలే నిరాహారదీక్షలు చేస్తున్నారు.

### రాస్తా రోకో

రాష్ట్రమంతటా, కారంచేడు ఘటనకు నిరసనగా 8 తేది జరిగిన రాస్తారోకో నెల్లూ

## నెల్లూరు సంగతులు

రులో మాత్రం విఫలమైంది! అసలు ఆ ప్రయత్నం కూడా ఎవరూ చేయలేదు. బిట్రగుంటలో మాత్రం రైళ్ళు నిలిపారు. నెల్లూర్లో హరిజన నాయకులేమయ్యారో, పదవులంటే మాత్రం క్యూలో వుంటారే?

### వ్యాయామ యోధుడి అకాల మరణం!

వెయిట్ లిఫ్టింగ్‌లో నాలుగుసార్లు రాష్ట్రఛాంపియన్‌గా ఎంపికైన, ప్రసిద్ధ వ్యాయామయోధుడు శ్రీ గుత్తుల రామకోటేశ్వరరావు (42) 9 తేది ఉదయం అకాలంగా మృత్యువాత పడ్డారు. ఆర్ టి సి బస్టాండులో గూడూరునుంచి వస్తూ బస్సు దిగాడట- గుండెపోటు వచ్చింది.

—కావలి 8 వ పేజీలో

# నెల్లూరు ముచ్చట్లు

విమర్శకుడు

## వి. ఆర్. కాలేజి లెక్కల తనిఖీ!

మొన్న విద్యాశాఖ ప్రాంతీయ డైరెక్టరు శ్రీ కృష్ణమూర్తి, చీఫ్ ఆడిటర్ శ్రీ టి. వెంకటరావు మరో ముగ్గురు ఆడిటర్లు వచ్చి రాముని ఐహ్యం గదికి, రికార్డు లున్న మరో రెండుగదులకు సీళ్ళువేసి, మరిరోజునుండి 1976 మొదలు కాలేజి లెక్కలు పరిశీలిస్తున్నట్లు తెలుస్తున్నది.

వివరాలు చెప్పేవారు లేరుకాని, అది కాస్త ఇంత రహస్యంగా ప్రారంభం మొదలుపెట్టిన ఈ కొండలో ఎలుక కూడా దొరకదేమో! ప్రత్యక్ష లక్ష్యం కూడా అదేనా?

## శాంతి సభలు

అఖిలభారత శాంతి సంఘీభావ సంఘం రాష్ట్రసభలు 28, 29 తేదీలలో నెల్లూరులో జరుగుతాయి. ప్రపంచ శాంతి సంఘం అధ్యక్షుడు శ్రీ రమేష్‌చంద్ర, పలువురు అంతర్జాతీయ ప్రముఖులు వస్తున్నారు. డా. సీతో న్యూఢిల్లీ, జవహర్‌లాల్ నెహ్రూ యూనివర్సిటీ ప్రొఫెసర్ శ్రీ కందాడి శేషాద్రికూడా వస్తున్నారు.

## గృహప్రవేశం



తన ఇల్లు తన ఆఫీసు తనపని తప్ప, మరో ప్రవృత్తిగాని వ్యాసంగంగాని వ్యవహారంగాని లేనిగట్టి శీలవర్తనుడు, ఇన్‌కంటాక్సు న్యాయవాది శ్రీ కాటంరెడ్డి సుబ్బారెడ్డి దర్గామిట్ట సరస్వతీనగర్, ఎం.ఎస్. ఆర్. అవెన్యూలో నిర్మించుకున్న నూతన భవనంలో 8 తేది ప్రవేశించారు. పూజకే ప్రవేశం చదంగారు 6 తేది బ్రాహ్మణ సంతర్పణతో మొదలుపెట్టి 8 తేది మధ్యాహ్నం పలావ్ విందువరకు గృహప్రవేశం తంతును దీర్ఘంగానే నిర్వర్తించారు.

మా గుంట సుబ్బారామరెడ్డి అవెన్యూను అలంకరించిన ఆ ఇంటి అందచందాలు; శోభ సౌందర్యంను గురించి వేరుగా చెప్పాలా? నూతనగృహం సుబ్బారెడ్డిగారికి సుఖ సంతోషాలు కాంతి సౌభాగ్యాలు ఒనగూర్చుగాక!

## మాలకొండయ్య ప్రకటన

గూడూరువాసి తూపిలి శ్రీనివాసులు అంతర్ధానానికి సంబంధించి గతవారం మా వార్తపై న్యాయవాది శ్రీ చివుకుల మాలకొండయ్య అనుపేరిట జవాబు పంపారు. "నా మీద అంత మతిభ్రాంతిగా ప్రకటించారు. నా జాబుకూడా పూర్తిగా ప్రకటిస్తారని ఆశిస్తున్నాను" అంటూ శ్రీ మాలకొండయ్య తన జవాబును ముగింపుచేశారు.

గతవారం మా వ్రాతను, మాలకొండయ్య గారి జవాబును మళ్ళీమళ్ళీ చదివాము. ఆ తర్వాత మాలకొండయ్యగారి జవాబుగురించి ఒక్కమాటలో "రుజాలు తప్పదు ఉన్నట్లుగా వుంది" అనే అభిప్రాయం దృఢంగా కలుగుతున్నది.

మా వ్రాతలో మాలకొండయ్యగారికి ముఖ్యంగా ఆక్షేపణీయంగా వున్న అంశాలు రెండు మూడు వున్నాయి; మేము లోతుగా విచారించమన్నామట; తన మూడుసార్లు, భక్తవత్సలంను ఐదుసార్లు పోలీస్ 'టార్గెట్' చేసిందట! ఇంతకంటే లోతుగా విచారణ చేసేదేమిటి అని ఆయన ప్రశ్న. మేము అసలు వీరిద్దరినే లోతుగా విచారించమన్నామా? ఎందుకా అనుమానం? అనుమానితులు ఎంత పెద్దవారైనా నిర్బంధంలోకి తీసుకొని విచారించి బయటకుతీయడం అవసరం అని వ్రాశామట; మాలకొండయ్యగారి ఆక్షేపణల్లో ఇదొకటి. దానికి ఆయనంటారు- "ఎంతపెద్దవారైనా అని నన్నుగురించేగదా అనడం? నన్ను నిర్బంధంలోకి తీసుకొనమని మీరు పోలీస్ సంహారకుగా ప్రవర్తిస్తున్నారుగదా" అని ప్రశ్నలువేస్తున్నారు.

గతవారం మా వ్రాతంతా శ్రీనివాసులు భార్య శ్రీమతి రాంబ పోలీసుకు ఇచ్చిన రిపోర్టు మీద ఆధారపడింది; పత్రికకూడా ఆధారం అదే. దాన్ని మేము ఏకపక్షంగాకూడా పరిశీలించ లేదు; మాలకొండయ్య గారినికూడా అడిగి ఆయన అభిప్రాయంకూడా పొందుపరచాము, అటువంటిదాన్ని మాలకొండయ్య- "అర్ధసత్యాలు, అసత్యాలు ప్రచురించి పత్రికాముఖాన కేసువిచారణ జరపడం (trial by News papers) భావ్యంకాదు" అనడం ఆయనమాటల్లోనే 'దురదృష్టకరం'. "నన్ను వివాదాల్లోకి లాగి ఇరికించ ప్రయత్నించడం సబబుకాదు" అని మాలకొండయ్య మరొకచోట ఆరోపిస్తున్నారు.

మాలకొండయ్యగారు తనకు తాను పెద్దవారినిగా చేర్చుకుంటే ఎవ్వరికి ఆక్షేపణ లేదుకాని, ఆ పెద్దవ్యక్తికి రావలసినవి ఆపాదించుకోవడమంటే ఏమిటి అర్థం? భక్తవత్సలం ప్రస్తావన వదేనకి తేవడమంటే ఏమిటి భావం? ఆయన ప్రకటనంతా అమిత అభిమానం, పరమఆక్రోశంగా వుందికాని; తన ఆక్రోశిత్వాన్ని. అమాయకత్వాన్ని నిర్ద్వంద్వంగా. అనుమానాలకు అతీతంగా చాటుకునేట్లుగా లేదు.

మాకు వ్యక్తులతో సంబంధంలేదు; శ్రీనివాసులు మూడు నెలలనుండి తన పదరంలేదు: అతను ఏమైనాడో దర్యాప్తులో తేలాలి! అతనినెవరైనా హతమార్చివుంటే అదికూడా దర్యాప్తులో తేలాలి; నిందితులెవరైంది కోర్టు ఏర్పరుయించాలి! అతని తల్లిదండ్రులు భార్య పిల్లలు అతనికోసం అల్లాడిపోతున్నారు. మూడునెలలైనా పోలీస్ ఆచూకీతీయలేక పోతున్నది కాబట్టే అంతగా వ్రాయవలసి వచ్చింది. తన సహకారిగా వచ్చి హితుడుగా వుంటున్నవాడు కాబట్టి శ్రీనివాసులు భార్య పోలీస్‌కు ఇచ్చిన రిపోర్టులో పేరు వుదహరించింది కాబట్టి మా వార్తలో, చర్చలో చిత్రీకరింపబడ్డాడు మాలకొండయ్య. అతని మరో సహకారుడు భక్తవత్సలం పేర్లు వుదహరించవలసి వచ్చిందికాని లేకుంటే ఆ పేర్లతో మాకు అవసరమేముంది?

ఏమైనా ఒక నిండుప్రాణానికి సంబంధించిన సమస్య ఇది; దీన్ని ఆచూకీ తీయలేకపోతే పోలీసుశాఖ బ్రతికుండి ఒకటే, చచ్చినా ఒకటే!!



## వి. ఆర్. కాలేజి లెక్చరరు పిహెచ్. డి.

పరిశోధనకు, పిహెచ్. డి. పట్టా పొందడానికి ఏ విషయమూ అనర్హం కాదు. వి. ఆర్. కాలేజి బాటనీ లెక్చరరు శ్రీ పి. వెంకటరామయ్య ముఖ్యంగా సొర బీరకాయలమీద పరిశోధనచేసి సమర్పించిన సిద్ధాంతవ్యాసానికి శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం ఆయనకు పిహెచ్. డి. ప్రదానం చేసింది.

వెంకటరామయ్య తిరుపతి- రిటైర్డ్ సబ్‌జడ్జి శ్రీ సి. శ్రీనివాసులు కుమారుడు.



నర్తకి జంట - వెంకట్రామ్, కామాక్షి

(కళ్యాణ వైభవం 9 వ పేజీ)

## మార్వాడీ స్త్రీ చావు- హత్యా? ఆత్మహత్యా?

నెల్లూరు మండపాలవీధి దగ్గరలోని

వేముగుంటవారి సందు 7 తేదిరాత్రి కుంజాల (20) అనే మార్వాడీయువతి

—కొనసాగింపు 9 వ పేజీలో

## అగ్నిప్రమాదంలో ఇద్దరు గిరిజన బాలుర చావు

ముత్తుకూరు మండలానికి చెందిన. పిడతాపోలూరు గ్రామంలో జరిగింది ఘోరం. మేకల పోలయ్య అనే గిరిజనుడు, పొలాల్లో గుంటె వేసుకొని కాపురముంటున్నాడట. 11 తేది వేకువన, కిరసనాయిల్ బుడ్డిదీపం వార్లి, మంటలు లేచి. గుడిసె అంటుకున్నదట, అందులోవున్న మేకల చంద్రయ్య (11) మేకల చల్లయ్య (10) అనే అతని ఇద్దరు కుమారులు ఆ మంటల్లో చిక్కుకొని సజీవదహనమైపోయారు.

# ఆంధ్రులలో కాబట్టి ఎన్టీఆర్ అందలమెక్కాడు!

35 ఏళ్ళలో 600 సినిమాలలో నటించి, గిన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్ పుస్తకంలో ఎక్కిన సుప్రసిద్ధ మలయాళ హీరో ప్రేమనజీర్ రాజకీయరంగంలో ప్రవేశిస్తానని ఒకప్పుడు పెద్ద ప్రకటన చేసి, గొప్ప సంచలనం సృష్టించాడు. ఎందుకో ఏమో ఆ తర్వాత విడుదలైన అతని చిత్రాలేవీ ఆర్థికంగా అంత విజయాన్ని సాధించలేకపోయాయి. ఒకే మూసలో పోసి తయారుచేసినట్లున్న కథల్లో నటించడంవల్ల ప్రేక్షకులకు విసుగెత్తిపోయిందేమో అని ప్రేమనజీర్

**ఆంధ్రుల రాజకీయ అజ్ఞానంపై ప్రేమనజీర్ చురక**

కోసం ఒక కొత్తరకపు కథను రాయించాడు. ఓస్కార్ అందించేడు "ప్రేమనజీర్ కనబడుటలేదు" అని. కొందరు రాజకీయవేత్తలు ప్రేమనజీర్‌ను అపహరించుకుపోయి ఒకగుహలో బంధించడం, అక్కడినుంచి అతను అష్టకష్టాలూపడి తప్పించుకుని బయటపడడం - అదీ కథ. కిందటి నెల ప్రేక్షకుల విరాళకేంద్రి కొన్ని థియేటర్లలో సినిమాను వేశారట. దాంతో ఆ తర్వాత చిత్రాలు తీసిన నిర్మాతలు పోస్టర్లలో అతని ఫోటో వేయించడానికి సాహసించలేకపోయారు. ఈ విషయం తెలిసి 'నజీర్ ఫిలిమ్‌ఫాన్స్' అసోసియేషన్ పెద్దగా గొడవచేసింది. ఈ అభిమానసంఘాలకు నజీర్ అడపాదడపా ఆర్థికసహాయం చేస్తుంటాడట. ఇప్పుడు నజీర్ వయసు 55. ఎంత మేకప్‌తో ముసుగు వేసుకోడానికి ప్రయత్నించినా వృద్ధాప్యఛాయలు కనిపిస్తూనేవున్నాయి. పైగా, కొత్తహీరోలెందరో ప్రవేశించారు. వారిమీద యువతరానికి మోజు కలుగుతోంది. పోనీ-రాజకీయరంగంలో ప్రవేశిద్దామా అంటే-మధుదత్, అమితాబ్ బచన్, శివాజీగణేశన్‌లు రాజకీయరంగంలో తనకన్నా ముందే ప్రవేశించి, ఏవిధంగానూ రాణించలేకపోయారు. అంతేగాక, తనకెన్నో పరిశ్రమలున్నాయి. వాటి నిర్వహణ బాధ్యతలు నిర్వహిస్తూ, మిగతా జీవితాన్ని గడపాల్సివుంది. "మరి ఎన్.టి.ఆర్. ముఖ్యమంత్రి అయ్యాడుకదా? మీకుకూడా ఆ యోగం వుండొచ్చేమో!" అని ఒకరడిగితే, "అది ఆంధ్రప్రజ గనుక ఆయన చీఫ్ మినిస్టర్ కాగలిగాడు. ఇక్కడ కేరళలోని ప్రజలు బాగా ఆలోచించిగాని ఓ నిర్ణయానికిరారు. అందుకే నేనుకూడా బాగా ఆలోచించి ఓ నిర్ణయం తీసుకోదలచాను, అనిచెప్పాడు ప్రేమనజీర్.



చూపులు....చూపులు కలిశాయి, మనసులు రెండూ మురిశాయి: ప్రేమ మైకంతో మాట్లాడేందుకు నోరు తెరిచిన పడలేదేమో, ఎదురుగా కూర్చునే ప్రేమలేఖలు రాసుకోడానికి సిద్ధపడుతున్నారు- భాను చందర్, శోభన. 'దాగుడుమూతలు'లో నిదీ దృశ్యం.

# ఆరుద్ర ఆంధ్ర సాహిత్యాన్ని అచ్చొత్తిస్తానన్న కృష్ణంరాజు!

బహుముఖ ప్రజ్ఞావంతుడు, ప్రముఖ కవి ఆరుద్రకు సెప్టెంబర్ 1 తేదీన మద్రాసులో షష్టిపూర్తి మహోత్సవం వైభవోపేతంగా జరిగింది. ఈ సన్మాన సభ కమిటీ ఛైర్మన్ డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి ఆరుద్ర సాహితీ-సేవలను, గుణగణాలను ప్రస్తుతిస్తూ, వివిధ ప్రక్రియలతో పరిణతిపొందిన ఆరుద్ర ఇంకా అత్యున్నతమైన శిఖరాలను అధిరోహించాలని తమ ఆశీస్సులు అందజేశారు. "తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన ఆరుద్రగారు సంగీత నాట్యశాస్త్రాలలో కూడా నిష్ణాతులు. వారి 'సమగ్ర ఆంధ్ర సాహిత్య చరిత్ర' చివరి సంపుటాలు ఆర్థిక అవరోధాలవల్ల అముద్రితంగా వుండిపోయాయని నాకిప్పుడే తెలిసి, ఎంతగానో బాధపడుతున్నాను. వాటి ముద్రణకు నేను నృత్యప్రదర్శన బెనిఫిట్ ప్రోగ్రాం ఇస్తాను" అని విశ్వవిఖ్యాత నృత్యకళాకోవిదురాలు డాక్టర్ పద్మాసుబ్రహ్మణ్యం ప్రకటించగా- "ఆ డబ్బుకాక ఇంకా ఎంతమొత్తం అవసరమైనా నేను భరిస్తాను" అని ప్రముఖహీరో కృష్ణంరాజు సభికుల హర్షధ్వానాలమధ్య ప్రకటించారు. సుప్రీంకోర్టు జస్టిస్ శ్రీ ఒ. చిన్నపరెడ్డి, శ్రీ ఆవుల సాంబశివరావు, శ్రీ బి.ఎన్. రెడ్డి, డాక్టర్ షావుకారు జానకి, సుప్రసిద్ధ ఆర్టిస్ట్ ఎ.ఎస్. రామన్, శ్రీమతి 'ఊర్వశి' శారద, నేపథ్య గాయని శ్రీమతి ఎస్. జానకి, ఇన్‌కంటాక్స్ కమీషనర్ డాక్టర్ ఎన్.ఆర్. శివస్వామి ప్రభృతులు ప్రసంగించిన అనంతరం ఆరుద్ర రచించిన ఛందశ్శాస్త్రాలను డాక్టర్ సి. నారాయణరెడ్డి ఆవిష్కరించారు. ఆరుద్ర దంపతులకు పుష్పమాలలు, పట్టువస్త్రాలను పలువురు సమర్పించారు.

## ఎ. కోదండరామరెడ్డి డైరెక్షన్‌తో కొత్తచిత్రం

సాహసా మూవీస్ అధినేత కె. సారథి ఇదివరకు "సత్యభామ" అనే చిత్రాన్ని తీశారు. కొత్తగా నిర్మించే చిత్రంలో కమలహాసన్, శ్రీదేవి నాయకానాయికలు. దీనికి సత్యానంద్ స్క్రిప్ట్ రాస్తున్నారు. సెప్టెంబర్ 11న ప్రారంభోత్సవం జరుగుతుంది. స్క్రీన్‌ప్లే దర్శకత్వం: ఎ. కోదండరామిరెడ్డి.

# మేకప్ మెన్‌తో నటి పరారీ

కొన్ని చిత్రాలలో నటించి డబ్బుతోపాటు కాస్తో కూస్తో పేరువచ్చినప్పుడు ప్రతి అడుగూ జాగ్రత్తగా వేయకపోతే ఎంత ప్రమాదమో ఇదివరకు కొందరు తారలకు పట్టినగతిబట్టి అందరికీ తెలుసు. స్వప్నప్రియ అనే నటి కొన్నిచిత్రాలలో నటించింది. "నువ్వొక్కతే సంపాదిస్తూంటే, మీ ఇంట్లోవాళ్ళంతా కూర్చుని తింటూ తెగబలిసిపోతున్నారు. రేపు నీ ఆస్తిపాస్తుల్లో చాలాభాగం కాజెయ్యవచ్చు. ఇప్పుడే కళ్ళుతెరవడం మంచిది" అంటూ ఆమెకు ఓ మేకప్ మాన్ బోధించాడు. ఆ క్షణంలో తన మేలుకోరేవాడు అతనొక్కడే అన్నంత నమ్మకం కలిగిందామెకి. సమయం చూసి ఇంట్లోఎవరికీచెప్పకుండా అతనితో పారిపోయింది. ఇంట్లోవాళ్ళు గాభరా పడ్డారు. పోలీస్ కంప్లెయింటు ఇచ్చారు. ఎంత గాలించినా ప్రయోజనం లేకపోయింది. చివరికి ఆ అమ్మాయి నేనే ఓచోట బెంగళూరులో అద్దెకుంటున్నదని, ఆ మేకప్‌మెన్‌తో వుంటోందని తల్లిదండ్రులకు తెలిసింది. వెళ్ళి బతిమిలాడారట కూడాను. "నేనేం చిన్నపిల్లను కాను, మేజర్‌ని. నాకు ఏదిమంచో ఏది చెడో బాగా తెలుసు. నావాడ్ని నే చూసుకున్నాను. ఇకమీదటిమీరుచూసుకోండి" అందట ఆ నటి. ఆ అమ్మాయి ఇంకా ఎందరి సలహాలు విని, తన జీవితాన్ని ఏవిధంగా చేసుకుంటుందో!

## స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా విద్యానగర్ (వాకాడు) నెల్లూరు జిల్లా

### వేలం నోటీసు

ఇందువలన యావన్మందికి తెలియజేయుట ఏమనగా స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా విద్యానగర్ (వాకాడు) నెల్లూరు జిల్లా బ్రాంచిలో ఈ క్రింద కనపరచిన అకౌంట్ నంబరు గల బంగారు నగలపై తీసుకొన్న అప్పు రెండున్నర సంవత్సరములు మించి యున్నను చెల్లించని కారణమున నోటీసులు పంపించి యున్నది అట్టివారు తక్షణం అప్పు మొత్తము చెల్లించని యెడల వారు బ్యాంకులో తాకట్టు యుంచిన బంగారు నగలను తేది 17-9-85 సాయంత్రం 4 గంటలకు విద్యానగరు (వాకాడు) స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా బ్రాంచి ఆవరణములో బహిరంగముగా వేలం వేయబడునని తెలియజేయడమైనది.

Agl. Loan No. 11/1278

— వేలం షరతులు —

1) వేలంలో పాల్గొనదలచినవారు ముందుగా రు 300/-ధరావత్తు చెల్లించవలయును.

2) వేలము తేదీని అవసరమైన యెడల వాయిదా వేయుటకు లేదా వేలంమధ్యలో నిలిపివేయుటకుకూడా బ్యాంకువారికి అధికారము కలదు.

3) ఈ వేలం విషయంలో తుదినిర్ణయం బ్రాంచి మేనేజరు వారిది. ఇతర వివరములకు బ్యాంకు పనిచేయు వేళలలో బ్రాంచి మేనేజరు గారిని సంప్రదించవలెను.

బ్రాంచి మేనేజరు


## జమీన్‌రైతు చందా

| | |
|---|---|
| సంవత్సరం చందా | 40-00 |
| ఆరునెలలకు .. | 20-00 |


# సోనియా

(మొదటిపేజీ కొరవ)

ప్రధానమంత్రిత్వానికి ఇందిరాగాంధీ తర్వాత తగినవారు ఆయనే అన్నారు; దేశానికి ఆయనే ఆశాజ్యోతి అన్నారు.... ఒక్కరేమిటి పొగడడానికి వున్న పద జాలాన్నంతా మినహాయింపు లేకుండా వుపయోగించివేశారు. ఎన్. డి. తివారీ లాంటి ముఖ్యమంత్రులే సంజయ్‌కు భజనపరులయ్యారు. వీరివల్లనే సంజయ్ గాంధీ తిరస్కరించింది. 'ఎమర్జెన్సీని' భూతంగా వించి తాను అప్రతిష్ఠపాలయ్యారు; తన తల్లిని కష్టాలపాల్జేశారు. ఇప్పుడు కాంగ్రెస్ అధ్యక్షతకు సోనియాగాంధీ పేరు ప్రతిపాదిస్తున్నారంటే, సంజయ్‌గాంధీ చేసిన బ్లేకేస్తారా అనే భయసందేహాలు తలఎత్తుకున్నాయి.

దేశాన్ని తన కుటుంబ వారసత్వం పాలు జేస్తున్నదని ఇందిరాగాంధీ జీవించినంతకాలం చెడ్డపేరును వ్యతిరేకతను భరించింది. సంజయ్‌గాంధీ ప్రాభవమే ఈ అనుమానానికి అపోహకు కారణమైంది. సంజయ్ అకాలమరణానంతరం రాజీవ్‌ను రాజకీయాలలోకి దించడం మూలంగాకూడా ఆమె ఆ వ్యతిరేకతకు గురికావలసివచ్చింది. కాని రాజీవ్‌గాంధీ అదృష్టమేమో, ఇందిరాగాంధీ ఆత్మార్పణ ఆయన ప్రధానిత్వానికి ఆక్షేపణ లేకుండా చేసింది; మనసుల్లో అసంతృప్తి వ్యతిరేకతవున్నా ప్రతిపక్ష నాయకులెవరూ బహిరంగంగా విమర్శించడానికి సాహసించలేకపోయారు. తర్వాత ప్రధానిగా రాజీవ్‌గాంధీ చేపట్టిన పాలనావ్యవస్థ విధానం, సౌమ్యవైఖరి ఆ "వారసత్వపు" పూనుకు ఆస్కారంలేకుండా చేసింది. ఇప్పుడు సోనియాగాంధీని కాంగ్రెస్ అధ్యక్షురాలు చేయడమంటే విశుద్ధుడైన నాయకుడుగా విఖ్యాతినందిన రాజీవ్‌కు చెడ్డపేరు తేవడమేకాదు; ఆయనకు తీరని తలనొప్పి కల్గించినవారవుతారు. సోనియాగాంధీపేరును సూచిస్తున్న భజనపరులు ఈ సూక్ష్మన్ని గ్రహించడం అవసరం.

పైగా సేవలో, త్యాగంలో, అనుభవంలో తలపండి తమ జీవితాలను కాంగ్రెస్‌కు అంకితం చేసినవారెందరో వుండగా కాంగ్రెస్ అధ్యక్ష పదవిని సోనియాగాంధీకి ఎందుకు కట్టబెట్టాలి? కాంగ్రెస్ అధ్యక్షతకు ప్రధాని అర్ధాంగి వడం అర్హతకాదు; కాకూడదు. అదీకాక, ప్రధానిత్వాన్ని- కాంగ్రెస్ అధ్యక్షతను ఒకరే నిర్వహించే సాంప్రదాయానికి ఇప్పుడైనా స్వస్తిజరగడం అవసరం. ప్రధానికి విశ్వాసపాత్రుడైనవాణ్ణి, ఆయనకు ఆత్మీయుడైన వ్యక్తినే కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నుకోవచ్చు; కృపలానీ, టాండన్‌లవలెగాక కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నుకోబడేవ్యక్తి ప్రధానికి అనుకూలంగా, ఆయన్ను అనుసరించే వాడుగా వుండడం మంచిది. అంతేకాని, ప్రధానే కాంగ్రెస్ అధ్యక్షుడుగా కూడా వ్యవహరించడమో; లేక దాన్ని ఆయన సతీమణికి అప్పగించడమో వుచితంకాదు;

మరొక ముఖ్యమైన విషయం- రాష్ట్రపతి ఉత్తరదేశీయుడైతే, ఉపరాష్ట్రపతి దక్షిణదేశీయునికిచ్చే సాంప్రదాయం పరస్పరం చాలకాలంగా కొనసాగుతున్నది. ఆ సూత్రం కాంగ్రెస్ అధ్యక్షతకుకూడా వర్తించడంబాగుంటుంది. ప్రధానిత్వంలో ఉత్తరదేశపు కాంగ్రెస్ నాయకుడుంటే; కాంగ్రెస్ అధ్యక్షత దక్షిణదేశీయకివ్వడం న్యాయం.

ప్రాంతీయ సమన్వయవిషయంలో న్యాయదృష్టితో వ్యవహరిస్తున్నారని సత్కీర్తిని పొందుతున్న ప్రధాని రాజీవ్‌గాంధీ కాంగ్రెస్ అధ్యక్షతకు సంబంధించికూడా ఆ విధంగానే వ్యవహరించగలరని ఆశించవచ్చు. అంతేకాదు తమ మెప్పుకోసం ఎవరెన్ని చెప్పినా సోనియాగాంధీ అభ్యర్థిత్వానికి రాజీవ్ తన అంగీకారాన్ని తెల్పకనికూడా వచ్చువచ్చు. —

## పెళ్ళిళ్లు

(9 వ పేజి కొరవ)

### త్రీ ఇన్ వన్!

'సింహపురి' సంపాదకుడు శ్రీ అకుల సుబ్రహ్మణ్యం ఏదిచేసినా, ఏదిచేసినా విలక్షణంగానే వుంటుంది అతనికుమార్తె వివాహానంతర సందర్భంలోకూడా ఆ ప్రత్యేకత తప్పిపోలేదు.

8 తేది సాయంత్రం 6.30కు అతని కుమార్తె ఇందిరకు; తోటపల్లి గూడూరు శ్రీ ఎన్. వి. రమణయ్య కుమారుడు శివనాగయ్యతో వివాహం.

ఉత్త వివాహమైతే అందరూ చేసేదే సీదాసాదాగా వుంటుంది 'త్రీ ఇన్ వన్' అంటారే ఆవిధంగా శ్రీ సుబ్రహ్మణ్యం పెండ్లికి మరో రెండు సాహిత్య కార్యక్రమాలు జతచేశారు. పెండ్లికి ముందు "సాహిత్య సమారాధన మహోత్సవం". జిల్లా జడ్జి శ్రీ డి. శివసాంబమూర్తిగారు అధ్యక్షులు; ఇన్‌డైరెక్ట్ ట్రెజరీ డాక్టరు మరుపూరు కోదండరామరెడ్డిగారి వుపన్యాసం: "ఆధునిక భగవద్గీత- మానవతా ఘోష మహాకావ్యాని" కి అధివక్త శ్రీ సుద్దాలి మల్లికార్జునరావు ఆవిష్కరణ; 'సాహితీరత్న' శ్రీ వి సి. సుబ్బరాయుడుశెట్టి, 'ప్రేమబంధు' శ్రీ అయితా అనందకృష్ణయ్య గార్లు సాహితీ నిందుకు ప్రముఖ అతిథులు".

రెండో కార్యక్రమం మానవతాఘోష కావ్యాన్ని "జాతినేహాంకిత దివ్యమూర్తి" అవేల్ చేర్మేన్ శ్రీ పి. కె. ఎన్. మాధవన్ గారికి కృతికర్త "ప్రేమాత్మ" అంకితమివ్వడం.

ఆఖరుగా సుబ్రహ్మణ్యంగారి అమ్మాయి ఇందిర వివాహం. ఇందులోనూ మరోకార్యక్రమం - "ప్రఖ్యాత కవిదంపతులైన శ్రీ శేకూరు సూర్యనారాయణశర్మ; శ్రీమతి భాగ్యలక్ష్మి గార్లకు నూతనదంపతులచే ఋత్విక్కుల వేదఘోషలమధ్య పాదపూజలు". శర్మగారంటే ఎవరోకాదు; "ప్రేమాత్మ" అజ్ఞాతనామంతోకవితలువ్రాసేఇండియన్ బ్యాంకి మేనేజరు శ్రీ వి. వి. ఎస్. శర్మ.

ఇవండీ అకుల సుబ్రహ్మణ్యం కుమార్తె వివాహమహోత్సవ విశేషాలు. ఇన్ని కార్యక్రమాల ఏర్పాటుకు, అహ్వానితుల భోజన మాటలు పొందికకు, ఆయన ఓపికకు, సుబ్రహ్మణ్యంను అభినందించాలి.

## నెల్లూరు సంగతులు

(4వ పేజి కొరవ)

అంత దారుఢ్యం కల్గిన శరీరంకూడా దాన్ని తట్టుకోలేకపోయింది, అక్కడే, ఆ క్షణంలోనే కన్నుమూశారు.

వ్యాయామంలో ఆయన నిపుణత అపారం; ఇటీవలే నెల్లూరులో తంగదాసు చౌదరి వ్యాయామ కళాశాల ఒకటి నెలకొల్పారు. ఆయనకు భార్య వుంది పిల్లలు లేరు.

## జిల్లావార్తలు

(4వ పేజి కొరవ)

టి. వి. రామానుజాచార్యులు ప్రసంగించారు. శ్రీ ఎస్ శ్రీనివాసుల కృష్ణ రిపై సినిమాపాటలు, శ్రీ పి. వెంకటేశ్వర్లు కృష్ణాష్టకం గానంచేశారు. శ్రీ వినమన శ్రీనివాసులు వందనాలు చెప్పారు.

(5వ పేజి కొరవ)

మరణించింది. ఆమె ఒళ్ళుకాలిన గాయాలతో చనిపోయిందట.

ఇది ఆత్మహత్యఅని పోలీసులు ఆ రోజే తేల్చి, కేసు కట్టివేసినట్లున్నారు. అయితే ఈవిషయంలో పలురకాలనందేహాలు తల్తెత్తున్నాయి; పుకార్లు విన్పిస్తున్నాయి.

మంజూర్, బాబుల్ నేతాజి(66) అనే కదుపవ్యాపారికి మూడవభార్య అట. మంచి యవ్వనంలోవున్న స్త్రీ ఆమె; అతను వృద్ధుడు. 7 తేది సాయంత్రం వచ్చింతా మంటలతో, వారి ఇంటిబాల్కనీ పైకివచ్చి పెద్దగా కేకలు పెట్టిందట అని విని చుట్టుప్రక్కలవారు రోడ్లో గుమికూడేనరికి, ఆమెను ఇంట్లోకి తీసుకొని పోయారట.

తర్వాత, రాత్రి 10 గంటల సమయంలో పోలీసులు వచ్చారు. అప్పటికే ఆమె శవంగా మిగిలింది. ఆమె భర్త చెప్పడం 7-30 కే ప్రాణం పోయిందని; తన భార్య గ్యాస్‌స్టౌ అంటుకుని మరణించిందని పోలీసులకు చెప్పాడట.... వారి ఇంట్లో అసలు గ్యాస్ పొయ్యే లేదట. పోలీసులు శవంతో పాటు మరి నలుగురినికూడా స్టేషన్‌కు తీసుకొని పోయారు. అక్కడేమి జరిగిందో తెలియకుంది, తర్వాత పోలీసులు పత్రికలవారితో, మంటలు ఒంటిపై కిరోసిన్ పోసుకుని చనిపోయిందని చెప్పారు.

ఆత్మహత్య అయితే ఏదైనా గదిలో గడిపెట్టుకుని చేసికావాల్సివుండాలి; ఆమె ఆరుబయటకువచ్చి ఎందుకు అరిచింది? ఆత్మహత్యే అయితే ఆమెను వెంటనే ఆస్పత్రికి ఎందుకు తీసుకుని పోలేదు? పోలీసులు వచ్చేంతవరకు ఇంట్లోనే ఎందుకు పెట్టారు?

నిజమని నిర్ధారించలేముకాని, ఆమె శీలంపై నేతాజీకి శంక వుందని ఒక పుకారు దానికి దీనికి ఏదైనా సంబంధం వుందా?

ఈకేసు విషయంలో పోలీసుల ప్రవర్తన అన్నిటికంటే అనుమానాస్పదంగా వుంది. ఎస్ పి శ్రీ గిరీష్ కుమార్ స్వయంగా పరిశీలించి నిజమేదో తేల్చడం అవసరం.



ఇటీవల దివంగతుడైన కళాజీవి ఎం విశ్వనాథరెడ్డి

## నగలకోసం ముదుసలి హత్య!

పాత పెద్దాస్పత్రి రోడ్డులో 7 తేది రాత్రి నాగం గురవమ్మ అనే 80 ఏళ్ళ ముసలిని ఆమె ఇంట్లోనే గొంతు నులిమి చంపి, వంటిపైన వున్ననగలు వలచుకొనిపోయారట. అర్ధరాత్రి సమయంలో జరిగింది హత్య. ఇంట్లోని వారందరూ ఏదో పెళ్ళికి పోవడంతో ఆమె ఒంటరిగా వుండిందట, సమయం కనిపెట్టి ఎవరో ఈ దుర్మార్గం చేశారు. పది జతల గాజులు, జత కమ్మలు పెరుక్కొని పోయారట.

## నీటిమట్టం

| | |
|---|---|
| కలిగిరి రిజర్వాయరు | 11.3 అ. |
| సర్వేపల్లి ,, | 3.6 అ. |
| నెల్లూరు చెరువు | 11.3 అ. |

వర్షంలేదు; రిజర్వాయర్లలో నీళ్ళు లేవు ఉత్తకార్తె వచ్చింది; ఈ సంవత్సరం గుంపెత్తనని వస్తుందా అనే నిట్టూర్పులో వుంది రైతాంగం.

## నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకులు | పుట్టి | 1700-00 |
| 2608 | | 1400-00 |
| ఐ. ఆర్. 20 | | 1400-00 |
| ఐ. ఆర్. 50 | | 1320-00 |

# నెల్లూరు జ్ఞాపకాలు

(11వ పేజీ తరువాయి)

లేకుంటే కిందపడిపోతాడు ద్వారా గావికిలేమ్మంది. ఆయన బాగా ఎద్దుకు మూడింతలు. క్లాసుకురాగానే పిల్లలంద రికీ పండగ. ఎన్ని అనుభవాలో, ఎన్ని తాగితవు ఏరో ప్లేటులో ఎన్ని బుద్ధ విరానోr ఇంత కచ్చురాటిగ్గా ఆయన తెలుగుపాఠం చెప్పేవాడు. ఒక తెలుగు పద్యంలో శృంగారరసం వస్తేచాలు నా తంగా. బంగారయ్య ప్రాణాలుతీసి, మైథునక్రియ అనేమాట వచ్చి నైన అచ్చ తెలుగులో ఆయన నోటనించి చెప్పించేంతవరకూ ఒకటే గోల; "స్వామి, చెప్పు స్వామి మా కర్థం కావటంలేదు, మైథునం అంటే ఏంటి?" అని సీరియస్‌గా ముఖంపెట్టుకొని అడ గడం. ఆయన రతి అని గర్భాదానం అని ఎన్నో పదాలతో డొంకతిరుగుడుగా చెప్పినా పట్టువదలకుండా 'నాయళ్ల'! విసిగిపోయి "సిగ్గలారా ముండాకొడుకుల్లారా మైథునం అంటే తెలియదు మీకు, ఒక్కొక్కడు పెళ్ళిచేసుకుంటే రథకా పిల్లలు కనడానికి తయారు!' అని కోపంతో అనేవాడు, "సోమి పిల్లలెట్లా కంటారు" అని మహా సీరియస్‌గా ఒకరి ప్రశ్న. "పిరవ, ఇంత వశి" అని నావాతిట్లు తిట్టి ఆఖరకు విసిగి ఆ రెండు అక్షరాలు చెప్పేవాడు. వెంటనే పిల్లలు "వన్స్‌మోర్, వన్స్‌మోర్ మాకు వినబడలేదుస్వామి మళ్లీసోమి, సోమి".

పార్థసారథి అయ్యంగారైతే ఈ స్థాయ వరకు రాకుండా ముందుగానే ఆ రెండక్షరాల చెప్పేసి పాఠకముంచిన్నీ హాసించేవారు. ఆయన మనమరాలు మంచి ధాటివేయకున్న పిల్లవాడు అంగు ష్ఠంగా చెంతేవాడు. ఇవి, "గంధకంలో ఉద్దీజా" అన్నారు పార్థసారథి అయ్యంగారు. దీపాలపిచ్చయ్య జాగ్రత్తగా గంటా అసిపిస్తే తన మధురకంఠంతో పద్యాన్నదివేవాడు క్లాసంతా గప్‌చిప్.

క్లాసుకు అడవులో పెట్టుకోడంలే నేనం తక్కువ తక్కిసాగర్థాల వగ తప్పు ఇక పాఠం ఎక్కడచెప్పేది? అవే కాలంకు. జీవితమమ్మేలకు సంబంధంలేదు గట్టి ఏటుగా పాస్‌గావడం అదృష్టంలేకుంటే ఫెయిల్; అంతేగాని ఆ జమైన తెలివి తేటలు పరీక్ష పడదేవికావు.

మాకు వైద్యుమాన్వర్‌విశ్వనాధంగారు. ఆయన ఏ పిల్లవాడినిగూడ పేరు పెట్టి పిలవడు. "ఒరే దాక్టర్" అనే వాడు వన్నా- మా నాయన దాక్టరు కాబట్టి. ఇంకొకడిని "ఒరే సర్జన్ జనరల్" వాడితండ్రి ఉరకర్మ చెరేవాడు "ఒరే కరణం", "ఒరే కొంపేరు బ్బాయి" అనేవాడు. నా మాలు వేమకొని నవ్వుగా పొడుగ్గా రంగనాయకులపేట పిల్లవాడి ని. ఇట్లా ప్రతివాడికి ఒక నిక్‌నేం పిల్లలు వంతక్కకు నిక్‌నేం ఇస్తారు కాని స్వారధం దాన్ని రివర్స్ చేశాడు. ఆయన పొడుం పీల్చేవాడు. ఆ పీల్చే క్రమం చాలతమాషాగం. పీల్చాలని బుద్ధి పుట్టినప్పుడు "రానుకొండి" అని దీర్ఘం చెప్పేవాడు. అంతేఅప్పుడు అటు ఇటు చూస్తూ తలుపుదగ్గరికెళ్ళి ఒక కణంలో చిటికెడు పద్యం శబ్దం లేకుండా పీల్చేశేవాడు. ఆ ముక్కుగుడ్లు ఎర్రగా అయిపోయేవి. ఎవరైనా దీనిని చూసి నవ్వు అయునట సందేహంవస్తేచాలు దేహో వాడు! యమబాదడు ఏదో స్పెల్లింగ్ సరిగాలేదనో, రైము సరిగాలేదనో, నోట్ బుక్ బైండ్ చేయలేదనో ఏదోఒకసాకు పెట్టి పీపు విమానం మోతమోగించేవాడు, అందరికితెలుసు ఆయన పద్యంఎప్పుడు పీ స్తాడని కాని అందరూతలవంచు కొని నోట్సురాస్తున్నట్టు నటించేవారు. ఆయన ఆ కాలంలో నల్గవపాఠంలో ఐదవపారంలోచెప్పేనైన్స్ ఈకాలంలో నాల్గవతరగతిలోనే పిల్లలు నేర్చుకుంటు న్నారు. అకాలంలో ఇంటర్మీడియెట్‌లో మహాకష్టంగావచ్చే లీవ ఏవిత్స. కెమిస్ట్రీ మొదలైనవి, ఇప్పుడు ఐదవఫారంలో మెట్రిక్యులేషన్‌కు ముందుగానే పిల్లలు నేర్చుకుంటున్నారు. ఎంత వెనకబడ్డ కాలమో చూడండి. కాని ఆ కాలంలో ఆవేవాంగొన్ను. లేబరేటరీలో అంతా కుకింగ్ ఎక్స్‌పెరిమెంటుగూడ సరిగా వుండేదికాదు క్లాసులో వంతులు నేర్పిన దానికి అక్కడ లేబరేటరీకి సంబంధం లేదు. "గుర్రెద్దు చేగెద్దట్టు" ఏకో చదవడం ఏకో రాయడం. తర్వాత ఉద్యోగం దొరకక అవస్థలుపడడం.... ఇదీ వరస.

——

## ప్రజ్ఞామూర్తి

(11వ పేజీ తరువాయి)

సాహిత్యానికి వెలుగుబాట చూపించారు. నెల్లూరు ప్రజలు వారి సాహిత్యమూర్తికి నీరాజనాలందించారు.

వీరి 'దిలీప' రూపకం కల్లాకట్టువారి హృదయాన్ని హత్తుకొన్నది; వారిచేత సంస్కృతంలో పరివర్తనం చేయించు కున్నది

'అద్వైతం' శ్రీ సుబ్రహ్మణ్యంగారి తత్త్వనవనీతం. అదికంకదుం మ్రుతి సాహిత్యం వారి ఆధ్యాత్మిక ప్రవృత్తికి పరికారం. 'సౌ దర్యలహరి' వారి తెలుగు నేతలో అందాలు విప్పుకొన్నది. 'శివానందలహరి' శిల్ప విన్యాసాన్ని వెలార్చింది.

షేక్స్పియరంటే సుబ్రహ్మణ్యంగారికి చెప్పలేని అభిమానం. 'టెంపెస్ట్' నాటకాన్ని ఒక బిగిలో మొక్కపోకుండా తెలుగులో కల్పీకరించారు. ఇంకా ఎన్నో సాహిత్య వ్యాసాలు వ్రాశారు; ప్రకటిస్తే కొన్ని సంపుటాలు కావచ్చు. సుబ్రహ్మణ్యంగారు చిత్రమైన వ్యక్తి ఒక పగాన కలం పట్టనేపట్టరు; పట్టితే వేపట్టింది తుదముట్టేదాకా విశ్రాంతికి తలపెట్టరు. మౌనంలో మననం; మననంలో తపనం వారు సాధించిన సిద్ధులు.

శ్రీ గుత్తం సుబ్రహ్మణ్యంగారు సాహితీసమితి సభ్యులు నెల్లూరులోని వేద సంస్కృత కళాశాల పరిపాలక వర్గాధ్యక్షులు. శ్రీ తిక్కవరపు రామిరెడ్డి గారు స్థాపించిన కవిత్రయ జయంతి ట్రస్ట్‌లో సభ్యులు. విష్ణాగవిష్ణులు; నిరతాన్న దాతలు. వారి వట్టేంట సందిక పరిషత్తులు జరగటం. వారి కమనవన్నల్లో కావ్యకలా పాలుసాగటం నెల్లూరివారికి నిత్యసత్యం.

శ్రీ గుత్తం సుబ్రహ్మణ్యం గారు ఛందస్సులో రచించినా ఛాందసంలేని చతురులు, అనువాదాలు చేసినా అభినవ లోచనులు: ప్రాచీన కవుల ప్రభావానికి లోనైనా ప్రతిభాశోభితులు: న్యాయవాద వృత్తికి న్యాయం చేసినా సహజ కవిత్వానికి అన్యాయం చేయని సమదర్శులు! లక్ష్మీకటాక్షాన్ని ఆకర్షించినా భారతీ వైభవాన్ని వదిలించుకొన్న ప్రజ్ఞామూర్తులు! వివేకధనులైనా వినయ సంపన్నులు! యశస్వి అయినా మనస్వి: సంస్కృత పండితుడైనా తెలుగు కవి.

## పేర్లకెక్కేవి

(మధ్య పేజీ తరువాయి)

"మాయదారి సోగాడు", రాశి అర్ట్ ప్రొడక్షన్స్ "పక్కనోడు", తరణీచిత్రాలయ "దమంజయుడు". మమాతా అర్ట్ పిక్చర్స్ "పెళ్ళికాని ఇల్లాలు". శ్రీ కాయి అర్ట్ క్రియేషన్స్ "తలంబ్రాలు", శ్రీ ఉమాభాస్కర్‌పిక్చర్స్ "దలాకీఇల్లుకు", విక్టర్ ప్రొడక్షన్స్ "మోహినీ శపథం", పీటిలో కొన్నిచిత్రాలు తెరకెక్కవస్తాయి. మరికొన్ని పేర్లుగానే మిగిలిపోతాయి.—



# రెక్టార్ వివరణ

(11వ పేజీ తరువాయి)

వచ్చాయి. ఈ డబ్బులో 3.68 వేలు మానటాకసంగావాడి లేబరేటరీలు, రీడింగురూము, హెల్త్‌సెంటరు, వర్క్‌షాపుషెడ్ తరగతి భవనాలు కట్టాం: మిగిలిన లక్ష 77 వేలతో విట సెంటర్ పర్నిచర్, లైబ్రరీ క్లాసురూముల నిర్మాణాలకు వినియోగించాం."

"ఏదైనా గల్లంతు జరిగిన్దనుకుంటే ఇందులోనే జరగాలి. అటువంటప్పుడు 23 లక్షలు గల్లంతు అనేది అసంభవం"

"నాకు అలవెన్సుగా ప్రతినెల 250 రూపాయలు తీసుకుంటున్నాను అనేది వింతవార్త! నాస్తనంటాడు" కాలేజీకి ముగ్గురు వైస్ ప్రిన్సిపాల్సు. ఒక ఆర్థిక సలహాదారు వున్నారు. వీరికి లెక్చరర్లుగా ఇచ్చే జీతం తప్ప అదనంగా ఏమీ చెల్లించడంలేదు. సీనియారిటీ జాబితాలు సక్రమంగా తయారౌతున్నాయి. తొందరపాటు నిర్ణయాలేవీ లేవు"

ఈ తొమ్మిదిసంవత్సరాలలో కాలేజీకి కోటి 36 లక్షల 61 వేల 393 రూపాయలు ఖర్చయ్యాయి. ఇందులో లోటు రు 31,191,39 పైసలు. జీతాలు, బిల్డింగులు, అప్పులు వడ్డీలు అన్నీ ఇందులోనే. ఈ సద్దుల ఎవరు పరిశీలించినా నాపై వచ్చిన ఆరోపణలు తొలగిపోతాయి."

ఇదీ రామచంద్రారెడ్డిగారి వివరణ.

జవహర్ భారతి నిర్వాహకులజీమామ్యమాన్యలతో నేనే పనిచేస్తున్న "వైద్యుపోరం"కు సంబంధించికూడా రకరకాల ఆరోపణలున్నాయని మేము ప్రచురించిన వార్తలను, శ్రీ ఎం. సుబ్బారావు ఖండించారు.

దీనిపేరు వైద్యుపోరంకాదట. 'వైద్యు అండ్ టెక్నాలజీ ఫిద్దిపిపెస్స్' అట; ఢిల్లీ కోని వైద్యు ఫోరంకు ఇది శాఖకాట ఇందులో కాము, మాజీ ఎమ్మెల్సీ శ్రీ ఎం. మాధవరావు కలిసి పనిచేస్తున్న మాటవాస్తవమేనంటూ, తామిద్దరూ సంస్థద్వారా మహోన్నత కార్యక్రమాలు నెరవేరుస్తున్నామంటు న్నారు దాయన గ్రామసీమల్లోకి మారక సాంకేతిక పరిజ్ఞానాన్ని తీసుకెళ్ళి నేర పెడుతున్నారట.

ఈ సంస్థ చేసేది. చెప్పులు కుట్టే వారికి శిక్షణ ఇవ్వడం, కట్టెల వాడకం తగ్గించడానికి పొగలేనిపొయ్యిలు తయారు చేసి గ్రామల్లో పంచడం.

చర్మకారి కళక్రింద వీరు ప్రతినెలా 10 మందికి శిక్షణనివ్వాలట. పొయ్యిలు లేక ఇవ్వడానికి చేయడంలేదట; దీనికి ఇందుకుగాను తొట్లు, పీటసంపులు, షెడ్లు ఏర్పాటుచేసుకుని వున్నారట.

1120 పొగరాని పొయ్యిలు 58 గ్రామాల్లో పంచిపెట్టాలన్నది రెండవ లక్ష్యమట; ఇప్పటివరకు 700పొయ్యిలు నిగించారట. తమ సంస్థ దాతాకక్కగా పనిచేస్తున్నామంటూరు, నిర్వాహకులిద్దరూ ...

ఈ ఖండనలపై ఒక వ్యాఖ్యా లెందుకు ...

# పినాకినీతీరం

(2వ పేజీ తరువాయి)

వంటి వారికి ప్రభుత్వ పార్టీలో వుండ వలసిన అవసరం ఎంతో వుంటుంది; ప్రభుత్వంలను మెప్పించడానికి ఏవో ప్రకటనలు చేయవలసి వుంటుంది.

అందువల్ల ఈశ్వరయ్యను అపార్థం చేసుకోవడం పొరపాటు; దానరి తిప్పలు పెరుమాళ్ళకెరుక!

### ఓపికున్నవారికి

### ఒక విజ్ఞప్తి!

ఓపికున్న రేడియో శ్రోతలకు ఒక చిన్న విజ్ఞప్తి-

రేడియో అన్ చేస్తే ఒకటేగోల! దానికిన్నికోట్లు, దీనికిన్నికోట్లు; ఆ జిల్లాకింత ఈజిల్లాకింత! అక్కడా పరిశ్రమ! ఇక్కడీ ప్రాజెక్టు; అక్కడన్ని వేలఇండ్లు, ఇక్కడి ఇన్నివేల ఇండ్లు; అక్కడ లక్ష్యానికిమించి సాధింపు ఇక్కడ లక్ష్యానికి అధిగమింపు.... ఒక్కటేమిటి ఆ కోట్లను లెక్కపెట్టుకోవడం, జ్ఞాపకం పెట్టుకోవడం దుస్సాధ్యమైపోతున్నది. ఏతావాతావార్తలకని రేడియో పెట్టుకుంటే ఇదీబోడ!

మన రాష్ట్ర బడ్జెటు షుమారు మూడు వేల కోట్లు; రోజూ ఆకాశవాణివలికే ఈ కోట్లన్నీ ఒక్కటి తప్పిపోకుండా వ్రాసిపెడితే నెలకు ఎన్ని కోట్లవుతాయో, సంవత్సరానికి ఎన్ని కోట్లవుతాయో తెలిసికోవాలని తీరని అభిలాష, ఒక మాటమాత్రం ఖచ్చితంగా చెప్పవచ్చు. రాష్ట్రంలోని పాత కోట్లన్నీ లెక్కవేసినా ఆకాశవాణి చెప్పేన్ని కోట్లు కావేమోననిపిస్తుంది! అయినా ఓపిక తీరిక వున్న శ్రోత ఎవరైనా కనీసం ఒక నెలపాటు రోజా లెక్క వ్రాసిపెట్టి మొత్తం ఎంతవుతుందో తెలిస్తే ధన్యవాదాలు చెప్తాను.

ఆ విధంగా అనుకోవడం పొరపాటు కావచ్చు కానీ, వింటుంటే అలాగే అనిపిస్తూ వుంటుంది ఈ అభివృద్ధి అంతా ఆకాశవాణి ముఖానేనా, లేక నేలమీద జరుగుతున్నదా అని!!

— ...సిరో...

## పంచాంగం

### భాద్రపదమాసం

సెప్టెంబరు 15 వ తేది నుండి అక్టోబరు 14 వ తేది వరకు భాద్రపద మాసం.

### వినాయకచవితి

18-9-85 వ తేది బుధవారం

### ఉత్తరకార్తె

26-9-85 వ తేది గురువారం రాత్రి 1-01 గంటల వరకు ఉత్తర కార్తె వుండును.

### సెప్టెంబరు తిథులు

14 శని అమావాస్య రా 1-05 గం. వ.
15 ఆది భాద్రపద శుద్ధ పాడ్యమి రా 11-03 గం. వ.
16 సోమ విదియ రా 9-06 గం. వ.
17 మంగళ తదియ సా 6-33 గం. వ.
18 బుధ చవితి సా 4-15 గం. వ.
19 గురు పంచమి ప 1-42 గం. వ.
20 శుక్ర షష్ఠి ప 11-34 గం. వ.

—నిమ్మగడ్డ వేంకటేశ్వరశాస్త్రి

# ★ అభినందనలు ★

## భారతదేశంలోని వైశ్యాబ్యాంకు బ్రాంచిలన్నిటిలో

**1984 సంవత్సరములో వ్యవసాయ, చిన్నతరహా పరిశ్రమలు, చిన్నవ్యాపారాలు, ప్రయాణ వాహనాలు, స్వయం ఉపాధిపథకాలు తదితర ప్రాధాన్యరంగాలకు ఋణములు ఇచ్చి, వసూళ్ళలో**

# ది వైశ్యాబ్యాంకు లిమిటెడ్ - నెల్లూరు

**అగ్రతాంబూలాన్నందుకొన్న సందర్భములో రోలింగ్‌షీల్డును నెల్లూరు బ్రాంచి మేనేజరు పి. సాంబశివరావుగారికి 15-9-85 తేది ఆదివారం సా. 6-15 లకు నెల్లూరు శ్రీ పాండురంగ అన్నదానసమాజములో జరుగు సభలో**

**శ్రీ వి. రాజగోపాల్,** జాయింట్ జెనరల్ మేనేజరు, ది వైశ్యాబాంకు గారు బహుమతి ప్రదానం చేసెదరు

నెల్లూరు వైశ్యాబ్యాంకు దేశంలోని వారి బ్రాంచిలలో గణనీయమైన అభివృద్ధి సాధించేందుకు కారకులైన

**శ్రీ పి. సాంబశివరావు**
నెల్లూరు బ్రాంచి మేనేజరు

**శ్రీ ఎస్.వి. సత్యనారాయణ**
అగ్రికల్చరల్ ఫీల్డ్ ఆఫీసర్

**మరియు ఇతర బ్యాంకి ఉద్యోగులకు హృదయపూర్వక అభినందనలు తెలుపుచున్నాము.**

### భవదీయులు

**Sole selling Agent: Phone: 3332**

**భారత్ ఇంజనీరింగ్ కార్పొరేషన్**
**16/608 సుబేదారుపేటరోడ్ - నెల్లూరు**










**Our Associate:**

**ప్రీమియర్ ఇంజనీరింగ్ కంపెని**
**16/609 సుబేదారుపేటరోడ్, నెల్లూరు**

---

ఆకుల సుబ్రహ్మణ్యం
సింహపురి ప్రెస్ - నెల్లూరు

బచ్చు బ్రహ్మయ్య అండ్ కో
శ్రీరంగరాజపురం - నెల్లూరు

కె శంకరరెడ్డి
వర్క్‌షాప్, పడుగుపాడు రోడ్డు - నెల్లూరు

నూతలపాటి రాధాకృష్ణయ్య
డీలర్, టాటా ఆయిల్ కంపెనీ
నెల్లూరు.

సౌభాగ్య ఎంటర్ ప్రైజెస్
ఫెర్టిలైజర్ డీలర్స్
S. H. పేట, నెల్లూరు.

M/s. వెంకటేశ్వర ట్రేడర్సు
ఫెర్టిలైజర్ డీలర్స్
స్టోన్‌హౌస్‌పేట, నెల్లూరు

M/s. కల్యాణి వైన్స్
ఉదయగిరి పేట, నెల్లూరు జిల్లా

---

ఎ పుండరీకాక్షం
ఆడిటర్, వాసవినగర్, నెల్లూరు

భారత్ ఇంజినీరింగ్ కార్పొరేషన్
సుబేదారుపేటరోడ్ - నెల్లూరు

చింతా శ్రీరామమూర్తి
అడ్వొకేటు
రంగనాయకుల అగ్రహారం, నెల్లూరు

ఎల్‌మెక్ ఎలక్ట్రికల్ ఇండస్ట్రీస్
కొండాయపాలెం, నెల్లూరు

M/s. కుమార్ ట్రేడింగ్ కంపెని
సుబేదారుపేట, నెల్లూరు

పి. వెంకట్రామయ్య
పౌల్ట్రీ ఫార్మర్
గుడిపల్లిపాడు, నెల్లూరు జిల్లా

M/s. తొండెపు బ్రదర్సు
ట్రంకురోడ్డు, నెల్లూరు

M/s వెంకటరమణా ఎలక్ట్రికల్స్
S.H. Pet నెల్లూరు

---

పి. బలరామిరెడ్డి అండ్ సన్స్
లాండ్‌లార్డ్. కదూరు - నెల్లూరు జిల్లా

డి. వెంకయ్య
ల్యాండ్ లార్డు - అనికేపల్లి

బాబా ఫారం
వవలాకులతోట, నెల్లూరు

చలువాది బాలయ్య
అరుణా ఆటోమొబైల్స్.
S. H. Pet నెల్లూరు.

కె. రాధాకృష్ణయ్య
ఆడిటరు, లక్ష్మీపురం - నెల్లూరు

M/s. మల్లికార్జున ఏజెన్సీస్
రంగనాయకుల అగ్రహారం, నెల్లూరు

M/s. రాఘవేంద్ర ఫీడ్సు
గుడిపల్లిపాడు, నెల్లూరు జిల్లా

టి.వి. చలమారెడ్డి
కంట్రాక్టరు, దర్గామిట్ట - నెల్లూరు

M/s. సుబ్రహ్మణ్యం
సైకిల్ స్టోరు. S. H Pet - నెల్లూరు

సి సి. సుబ్బరాయులుశెట్టి
సెక్రెటరి & కరస్పాండెంట్
శ్రీ సర్వోదయ కాలేజి కమిటీ - నెల్లూరు

Edited, Printed & Published by N. Sree Ramamurthy, Printed at The Zamin Ryot Press, Thipparajuvari Street, Nellore (A. P.)